# కల్యాణకింకిణి

కవి :

మల్లవరపు విశ్వేశ్వరరావు

నవ్యసాహిత్యపరిషత్తు

వెల : రూ. ౧.

సహాధ్యాయి, సుహృన్మణి, సహృదయుడు,

శ్రీ బెజవాడ గోపాలరెడ్డికి

# పరిణయోపహారము

ఒక మహాగర్వి కవికుమారకు డొసంగు
పారితోషికమ్మిదియ గోపాలమంత్రి!
బాల్యసౌహార్ద మందిచ్చు ప్రతిఫలమ్ము,
కావ్య "కల్యాణకింకిణీ" కలరవమ్ము!

నిత్యసౌభాగ్యములకు సన్నిలయమైన
శుభవివాహముహూర్త ముత్సుకత నింప,
స్వర్ణమంజీర ఝుణఝుణంఝుణిత చరణ
యుగళ ఈ కావ్యకన్య నా యొసగు నుపద!

ఏ దినాంతవేళల సాలవీధికా సు
శీతలచ్ఛాయ "శాంతినికేతనము"న
బాలబాలికా కిలకిలోద్వేల హాస
విలస నాలాప గీతికోచ్ఛలిత గంధ
వాహముల గూడి నవనవోత్సాహ విహార
ణమ్ములం దేలియాడి యున్నామొ,

మరియు

నే శుభోదయమ్ములను మహాశయులకు
గురువుల కుసుమాంజలి ఘటించి, తరుల మూల
ములను జేరి, చిగుళ్ల సంచలనములకు
దోడుగా గుండెరెక్కలల్లాడ, జ్ఞాన
పాఠముల నేర్చినారమో పరమనిష్ఠ!

"పుష్యసప్తమి" నాశ్రమపుణ్యభూమి
దివ్యతేజోవిరాజిత దేవళస్థ
పూజ్య "గురుదేవ" కంఠవిస్ఫురిత వాక్సు
ధాలహరి, ముక్తచైతన్యవారి, నోల
లాడి మనమిర్వురము నెన్నియేడు లరిగె!

నేడాయాశ్రమమాత మందిరమునందే కాలముంబుచ్చి, తత్
క్రోడంబందె వసించి జ్ఞానమధువుం గ్రోలంగగన్నట్టి యీ
ప్రీడామంజుల ముగ్ధబాలికయ నీ వియ్యంబు దా గోరె, నా
క్రీడాశింజిని కావ్యకన్యకయు గోరెన్ నీదు నెయ్యంబునే !

నిశితకంటకాధ్వమ్ముల నిరతయాత్ర
బడలినంత నాకై పాటబాడు బాల
కావ్యమానసపుత్రి నీ కరమె కోర,
నాకు మిగిలెడి దేమియున్నదియొకాని ....

కాంతామణీ, కావ్యామర
కాంతా మణికింకిణీయును కలభాషిణులే,
చింతా క్రాంతక్షణముల
శాంతసుధాలాప నిత్యసఖ్య మొసగుతన్ !!

# అనుక్రమణిక

ప్రవేశిక .... xi...xiv

స్త్రీ .... ౧

స్వర్ణకింకిణి .... ౯

ముక్తరాగిణి .... ౧౦

ఓ రాణి ! .... ౧౪

ప్రశ్న .... ౧౬

ఈనాటికి.... .... ౧౭

సంధ్యా ! .... ౧౮

విద్యున్నారి .... ౨౦

నవవర్షా ! .... ౨౨

కరుణకాకలి .... ౨౫

శమనశ్రుతి .... ౨౭

ఎవ్వరు ? .... ౨౮

ఆకాశం .... ౨౯

నవాలోకము .... ౩౧

వసంతయాత్ర .... ౩౪

కీలాంజలి .... ౩౭

దేవీ ! .... ౪౦

ఆకాశతార .... ౪౩

ఐంద్రజాలిక .... ౪౫

ఉగాదికాన్క .... ౪౬

మోహితవని .... ౫౧

# ప్రవేశిక

విశ్వేశ్వరరావుతో, అతని కవిత్వముతో పదిహేనేండ్ల పరిచయము ఉందినాకు. ఆ పరిచయానికి ఫలమే ఈ ప్రవేశిక.

ఆంగ్లసారస్వతాన్ని, వంగసారస్వతాన్ని దొరికినంతవరకు జీర్ణము చేసికొన్నవాడు విశ్వేశ్వరరావు.

'మధుకీల' అతని మొదటి కావ్యసంపుటము. ఈ 'కల్యాణ కింకిణి' రెండోది. దీనికి ఈ పేరుపెట్టడములో విశేషములేక పోలేదు. ఆ విశేషము కల్యాణ శబ్దములో—

పూజ్యశ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారూ, విశ్వేశ్వరరావూ, శాంతినికేతనములో రవీంద్రకవీంద్రుని ప్రియాంతేవాసులు. ఒకరి నొకరు అర్థముచేసికొన్న మిత్రులు. అందుచేతనే, అమాత్యులైన గోపాలరెడ్డిగారికి కాక, 'సుహృన్మణి' అయిన గోపాల రెడ్డికి, వారి కల్యాణసమయాన ఈ 'కల్యాణకింకిణి'ని పరిణయోపహారము చేశాడు ఈ 'మహోగర్వి కవికుమారుడు'. ఈ కల్యాణము రెడ్డిగారికీ, కృతికన్యకకూ కూడా,—

మరోవిశేషము. ఈ కావ్యసృష్టికి ఆవేశము కల్గించినది భావనాజగత్తులోని ఒక స్త్రీ. ఆమె అమృతసౌందర్యమయి. 'అమరసంగీత నిత్యానంద సంధాయి'. కవనంలో కలగీత

మంజుభావాలూ, భువనాలందలి సుందరోజ్వలశ్రీలూ, ప్రతిబింబించిన ఈ కావ్యకాంతకూడా అటువంటిదే. మధురస్వనమూ, మంజుల సౌందర్యమూ ఒలికించేదే ఆలంకారవిశేషమైన కల్యాణ కింకిణికూడా. ఆ స్త్రీలింగ శబ్దము ఈ కృతికి పేరు కావడము హృదయంగమమూ, కావ్యాత్మవ్యంజకముకూడా—

కవికి పదునైన హృదయము ఉండాలి. ఉంటేనే కాని దేనినీ ఆవేశముతో అనుభవించలేడు. ఎప్పుడూ కవిహృదయము సౌందర్యముకోసము అన్వేషిస్తూ ఉంటుంది. లోకము పరిగణించని అల్పాల్పవస్తువులోకూడా కళాదర్శకుడైన కవికి సౌందర్యానుభూతి దొరుకుతుంది. ఆ అనుభవానికి రూపకల్పన చేస్తుంది సహజమైన భావన. ఆ రూపకల్పన ఎంత సౌందర్యమయము అవుతుందో కవిసృష్టికి అంత విశిష్టత సమకూరుతుంది. అనుభవాన్ని సౌందర్యముతో పొదిగి, నిత్యనూతనమూ కళామయమూ చేయడమే కవిసృష్టికి ప్రయోజనము. ఆ ప్రయోజనము సహృదయుడిలోమాత్రము ఫలిస్తుంది. సహృదయ హృదయాహ్లాదకత్వమే కవిత్వము—

మామూలు మానవులవలె తనకుదొరికిన దానితో తృప్తిపడడు కవి. ఏదో తీరనికోరిక, ఏదో ఉన్నతాశయము ఆతనిముందు నిల్చి ప్రశ్నిస్తూ ఉంటుంది ప్రతిక్షణమూ. కంటికి కాన్పించేసృష్టిలో తన ఆశయాలకూ, ఆదర్శమునకూ, దప్పితీర్చే సౌందర్యసుధ లభించనప్పుడు కవి, ఒకభావనా ప్రపంచాన్ని సృష్టించుకొంటాడు. ఆ ప్రపంచము వాస్తవ ప్రపంచముకంటె వాస్తవము. నిత్యనూతనము. సౌందర్యమయము. ఆ ప్రపంచానికి అధిదేవత స్త్రీ. ఆమె కామతృప్తికి ఆధారమయ్యే వ్యక్తికాదు. ఆమె ప్రేమస్వరూపిణి.

కలామయి. శక్తిరూపిణి. జీవన దేవత: ఆమె కటాక్షదీప్తి సోకినకొద్దీ కవిహృదయములో అమరగానము అరంభమవుతుంది. అదే కావ్యసృష్టికి ఆరంభక్షణము. కల్యాణకింకిణిలోని 'స్త్రీ' అనే కావ్యములో ప్రతిబింబితమయింది ఈ ఆదర్శమే.

ఈ ఆదర్శము కోసము సలిపిన అన్వేషణమే 'మధుకీల.' ఆ అన్వేషణానికి ఫలశ్రుతిగా స్ఫురిస్తుంది ఈ 'కల్యాణకింకిణి'.

'మనుజుల దుర్భర జరామయదారిద్ర్యాల'తో, 'దుష్కృత కల్లోలాలతో' దినదిన పరిదుఃఖితమైన ఈ ఇల, సృష్టి జాలంలో శోభను కనదలచిన విశ్వేశ్వరరావుమనసును సంకెళ్ళగట్టి బంధించింది. ఈ లోకయాత్ర కఠోరమయింది. ప్రోఢైన జీవాన్ని ననదొడిగించే 'ఐంద్రజాలిక' అయిన 'భావనాంబరోచ్చ తారానారీమణి' కోసము, అవనీతీరాలెల్ల వెదకి వేసారిన అతనికి, జీవంలో, ఒక అర్థరాత్రి కల్యాణ 'కింకిణీక్వణాహ్వానం' వినవచ్చింది, అదే 'నవజీవ ప్రారంభం'. ఆ శుభక్షణము మొదలుకొని అతనికి సంధ్యలో, నవవర్షలో, ఆ రాశతారలో, విద్యున్నారిలో— ఒకటేమిటి-— సమస్తసృష్టిలో, ఐంద్రజాలిక అయిన ఆ భావగాయని సౌందర్యమూ, గానమూ అనుభూతము కాసాగింది.

హృదయముతో అనుభవించగలిగినది అంతా మాటలలో వెల్లడికాదు. దాని ఛాయను వెల్లడించేశక్తికూడా మాటలకు ఉన్నదో లేదో—అందుచేతనే కవి తన అనుభవాన్ని స్ఫురింపజేసే పరిభాషను ఉపయోగిస్తాడు. ఆ పరిభాష సంప్రదాయ సిద్ధముగా ఉంటేనేకాని, పదబంధముమాటున ఉన్న భావప్రపంచములోకి

వెళ్లలేము. కవి ఆ విషయములో ఎంత శ్రద్ధాళువై ఉంటే కావ్యానికి అంత శోభ వస్తుంది.

స్త్రీ, ఆకాశతార, కీలాంజలి, అనేకావ్యాలలో తప్ప తక్కిన అన్నింటిలో విశ్వేశ్వరరావు కావ్యభాషనే ఉపయోగించాడు. అక్కడక్కడ సమాసఘటనలో కొంచెము స్వతంత్రించాడు. శాబ్దిక జీవులు, వాటిని చ్యుతసంస్కారదోషా లనవచ్చు, కాని అర్థస్ఫూర్తికీ, శ్రావ్యతకూ, ఔచితికీ భంగము రానంతవరకు కవికి ఆ మాత్రము స్వేచ్ఛ ఉండవచ్చుననడము సమంజసము. మహాకవులుకూడా ఆ మార్గాన్నే నడిచారు.

వృత్తాలు నడిపించడములో ఇంకా సిద్ధహస్తుడు కాలేదు గాని, కొత్తకొత్త ఛందాలను 'భావావేశము పదాలకూర్పులో ధ్వనించేటట్లు' నడిపించాడు విశ్వేశ్వరుడు.

ఇతని 'నవవర్షా' చదివేటప్పుడు హృదయములో వర్షము కురిసి తీరుతుంది.

నవాలోకము : ఇప్పటికవులకు ఎంతమందికో ఇది 'నవాలోకము' అనిపిస్తుంది.

ఉగాదికాన్క చదివితే ప్రతి ఉగాదికీ ఇటువంటి కాన్క కోరే బుద్ధి పుడుతుంది.

విస్తృతభావాన్ని విరళపదబంధములో ఇమిడ్చే శక్తి విశ్వేశ్వరుడి సొమ్ము. అది చాలామంది కవులకు లభించదు.

యతిప్రాసమైత్రిలో కొంత ప్రత్యేకత చూపినా అది ఎంతో అలవాటు పడ్డచెవికిగాని తట్టనంత సొగసును ఇముడ్చు కొన్నది.

చెప్పవలసివస్తే ఒకొక్క కావ్యములోని గుణాలనుగూర్చి ఎంతైనా చెప్పవలసి ఉంటుంది. కాని — ఇది ప్రవేశిక.

వేదుల సత్యనారాయణ శాస్త్రి.

# స్త్రీ

ఓ నవయువతీ !
ఎవతెవు
నీ వీరాత్రి నన్ను మేలుకొల్పావు ?

ఏ తారాకోమలాంగివో నీవు
ఏ తేజస్స్నిగ్ధదేహవో కాని
నా స్వప్నప్రాంతరాంతరాళంలో
నీ స్వర్ణాంకితకింకిణీక్వణాహ్వానం
రేకెత్తించి, నదించి, ప్రజ్వలించావే
నా కామం !

కోమలాంగి ! నీ
దివ్యాకారం నా ఎడందఅద్దంలో
ఈ కల్యాణముహూర్తమౌ నిశీథంలో
ఆకుల్లోడిగిన పూలమొక్కలా నిల్పా
వో కన్యా !

ఈ లోక కఠోరయాత్రలో నాలో
డోలాందోళిత భీత భావనాజాలం
జాలై, వాగై, ఓ మహాప్రవాహమై,

నా జాగ్రదవస్థనెల్ల ముంచెత్తి,
నా జ్ఞానప్రవృత్తులెల్ల కుంచించి,
నా జీవాన్ని ప్రసుప్తం చేసిన చీకట్లో,
ఓ జవ్వనీ !
పూజాపుష్పాంజలితో విరిశావో
తేజస్స్వరూపిణీ ! రాణీ !
తారాజ్వలిత లలిత కాంతిమయీ !
శాంతిమయీ !

* * *

భువనోద్రేకాలు నా మనః ప్రాకారం
గమియింపకనే నిల్పుకుంటి నిందాకా,
భవదీయ ప్రణయవిహ్వా లాహ్వానో
త్సవ మెపుడోయని తెరచికొంటి నా హృదయో
ద్భవనద్వారం !
అయినా నీ
వవతరించు టెపుడో ఈ కాలపు
యవనికాంతరం విరజిమ్మకు నా జీవంలో
పవనం నా చెవులో ఊదిందా ?
భువి చెప్పిందా ? దివి చెప్పిందా ? నా
హృద్భువనాంతర మొక నిరంతరస్వప్నమ్మై
నవసిందిగదా ! ప్రసుప్తమై యుందాకా !

ఓ యువతీ !

నీ వెవతెవో, నీ పేరేమో,
ప్రవచింతువాకో ఈ ప్రేమోద్ధృత ప్రశాంత
సముజ్జ్వల వివశత్వంలోనే !
ఓ నా భవతారిణీ ! నిరంతరనవతరుణీ !

* * *

నీ తారుణ్యం, నీ ప్రశాంత ప్రేమోద్రేకం
నా తాపోపశమ మ్మొనర్చి, నా జీవం
ప్రాతరరుణ రాగరంజిత స్మృతి
పూతమ్ము బొనర్చె నీ నిశీథంలో !
ఈ తపస్సులే ఉషస్సుగా విరిసెన్
నీ తనుప్రభూత సుందరత్వంలో !
నా తపనా ప్రతిఫలస్వరూపిణీ !
విస్ఫీత భావనాంబరోచ్చ తారానారీమణీ !

భువనాలందలి సుందరోజ్జ్వల శ్రీలూ,
కవనంలో కలగీత మంజుభావాలూ,
నవమందాకిని శీత వాతపోతాలూ
రవళించెన్, స్ఫురియించె, తళుక్కుమన్నా యో
దివిజాంగన ! నీ ప్రసన్న సన్నిధానంలోనే !

* * *

బరువై బరువై దిగలాగె మంటి పెనుభూతం,
కరవై కరవై మటుమాయమాయె ఆనందం,
నరలోకవాసులెల్ల రాల్చు బాష్పజలం నా
నయనాలలోనె పొంగిపొంగి కరడయ్యెన్ !
మజ్జీవనాంతికంలోనే లోకపు దారిద్ర్యం
కుమిలింది, కుమిలి క్రుంచివైచె నా ప్రాణం,
రమణీ !

అది యౌవనోచ్చ భావబంధుర మ్మోకాలం !
అది నవ్య వి స్తృత వాసంతాభ్యుదయావసరం !
అది మామక విశాల నవజీవప్రారంభం ! నీ
అవతారం నా కన్నులగట్టిందా నాడు ?
అవనీతీరాలెల్ల వెదకి వేసరితిన్ నీ
నవకోమల పాదపద్మరజం కోసం !
పలవించా, పలవించా, విలపించా నే
నో కలరాణీ ! నీ
లవితానురాగబలం కావాలని, కానీ
తెలవారెను, అరుణరక్తిమలు క్రుంకెన్,
తెలికాంతుల శశి రేయిరేయి కృశియించెన్,
బలమేది విశీర్ణమయ్యె నా కోమల
తరుణజీవిత ప్రళయోద్వేగానలం నాలోనే !

* * *

జనసంతానంలో కలిగే దుష్కరకల్లోలాలూ,
మనుజుల దుర్భర జరామయదారిద్ర్యాలూ,
దినదినపరిదుఃఖితమౌ నీ యిల మాత్రమె నా
మనసును సంకెళ్లగట్టి బంధించెన్ ! నే
కనదలచిన శోభ సృష్టిజాలంలో, ఈ
మనుజుల దీనార్త రోదనధ్వానంలో
పడి నలిగి, నా
మనస్సులో నీరసమై, నీరవమై, భావనలను
కరగించెనొ ! కరుడుకట్టెనో !

అప్పుడు నీ
ప్రణయబలం ఈరీతి వరించిననాడే
జీవం మ్రోడైనా
ననదొడుగు నటంచు ఎడందలో ఏమైనా
వినబడ్డాగానీ, అది ఒకానొక రొదయే !
ఓ సుమకోమల సుందరోజ్వల
స్త్రీవ్యక్తీ ! శక్తీ !
ఆ రొదలోపలి రొదయే నా చేయూతై, నా
లేయెదలోపలి యెద కలలో కలువరింతయై
మెదిలి మెదిలి నన్నెల్లెడ వెదకించెన్ నీ
యెదియో తెలియని సహవాససహాయం కోసం !
అదునే కాలేదో ఆ తొలికాలంలో, నా
హృదయంలో ఒంటరినై నే నిలబడి ఏదో

పదముల సవ్వడికై ఎదురుచూచి చూచి
అలసితిన్, నా హృదయేశ్వరి !

* * *

ఈనాడీ అలసిన ఆశాజీవం నిదురించిన ఈ
యర్ధరాత్రి నీ దరస్మితాహ్వానాలోకమ్మా
యంతరిక్షసీమ నుండి దిగి నాపై
కురిసెనో జాలై, తారై మెరిసెనో, పూలై విరిసెనో :

ఈలోనే నీ కాంతితనువు నా దేహం దరిసి,
అలపుగొన్న నా స్వప్నజీవితావరణం
మేలుకొలిపి,
నా హృదయోద్భవనంలో దీపం నిలిపితివే !
విలసిత లావణ్యశ్రీవై !
స్త్రీవై !
నీవై !

నీవెవరైనా, నీపేరేమైనా కానీ !
నవనిత్య యౌవనానందప్రాణీ ! !

# స్వర్ణకింకిణి

ఖంగని మ్రోసె నీ కంఠస్వరమ్మహో !
పొంగె శబ్దాంభోధి భంగమాలిక లోహో !!
అనసూయ ! నీ పాట మనసులో మనసులో
కలిసిపోయెను దీపకళికలో కాంతిలా !

గాన గగనోచ్చలోకాన తేలించావు.
పాతాళ గంగాంబుపాతాల ముంచావు.
అనసూయ ! నీ గళ మ్మంతరాంతరములో
స్వనియించె స్వనియించె స్వర్ణకింకిణి లోహో !!

నవ్యకోకిల తూర్యనాద నిధ్వానమ్మొ
ధీర నీలాద్రిసమీర మంజురుతమ్మొ
అనసూయగాన నిస్వనితమై, ధ్వనితమై
మన సే యపూర్వసాంత్వనము పొంది శమించె !

చిరుదీపికలు మెరసె ! చిరుగజ్జియలు మొరసె !
రేగె వెన్నెలమంట, లూగె తీయని ఘంట,
లనసూయబాల రాగాలాపన జ్వాల
కరగించె కరగించె కలుషభావన లెల్ల !
కదలించె కదలించె నిదురజీవన మెల్ల !!

# ముక్తరాగిణి

పవడాల వర్షమై
జవరాలి హర్షమై
రవలపెదవుల గాన
రవళి తుంపెసలాడి,

శేఫాలికా ద్రుమ
శ్వేతారుణ ప్రసూ
నాతిమోహన మధు
స్రోతస్తుషారమై,

ఝల్లుఝల్లని కురియు
ఘల్లుఘల్లని మొరయు
నీ రాగనిర్భరో
న్నిద్ర మూర్ద్రగళమ్ము!

ఓ రాగమాలికా!
ఓ యింద్రజాలికా!
నాగసర్పం పడగ
లాగైతి నీ మ్రోల!



ఆకులమ్మో మనసు,
అతుల తన్మయతయో,
ఆకలియొ, తుష్టియో,
శోకమ్మొ, సాంత్వనమొ,

ఘనతృష్ణయో, సుధయొ,
అనలమ్మొ, సుషమయ్యొ,
అమలినాత్మ నివేద
నమ్మొ యేమోకాని,

అమరసంగీత ని
త్యానంద సంధాయి !
భ్రమరకీటన్యాయ
భాతి పరువమ్మైతి !

ఓ భావగాయనీ !
ఓ జీవదాయినీ !
నాగసర్పం పడగ
లాగైతి నీ మ్రోల !



ఏ గులాబీ తోట,
లే హిమాంబువు తేట,

లే పెద్దపులివేట
లేమి కంటినొకాని,

నీ కరాళజ్వాల,
నీ సితాంబుజమాల,
నీ సురభిగీతాల
నేమి వింటినొకాని,

నా రక్త ముప్పొంగి,
నా కన్గవ ముడింగి,
నా జీవచైతన్య
వర్తనమ్ము చెలంగి,

ఓ ముక్తరాగిణీ !
ఓ ముగ్ధభోగినీ !
నాగసర్పం పడగ
లాగైతి నీ మ్రోల !



స్వర్ణకలశము ప్రిదులు
శబల శీతల సుధలు
నిర్నిమిత్తమ్ముగా
నిస్యంద మైనట్లు

పులుకుపులుకున జిలికి,
బొళుకుబొళుకున దొణికి,
కలకలధ్వని నొలికి
పలికితివి ! పాడితివి !

కలకంఠి ! కలకంఠి !
గానామృతస్యంది !
రాగసిక్తము ఎడద
రంజిల్లు ! రంపిల్లు !

ఓ మృదులరాగిణీ !
ఓ హృదయభోగినీ !
నాగసర్పం పడగ
లాగైతి నీ మ్రోల !

# ఓ రాణి!

వనులలో, వనధి నిధ్వనులలో, నాలోని
అణువణువులో నీ సుధాలాపనమె నేడు!

తనువు పులకలుదేరి వినగోరి నినె కోరి
మినుమన్నులం దెల్లెడను వెదకు నా యెదకు

దరిసెనమ్మియవే! వరగాయనీమణీ!
తరవిరావే తెరలచెర వీడి ఓ రాణి!

*    *

లతలలో, చలతటిల్లతలలో, క్షితిలోని
ప్రతిజీవి గుండెలో ప్రతినినాదము నేడు!

అతలమ్ము సోకినా, ద్యుతలమ్ము ప్రాకినా
అతులమ్ము నీ కలశ్రుతి నందలేరెందు,

మంజువాణీ! మంజుశింజానకింకిణీ!
మృదురాగవాదనీ! హృదయవీణాపాణి!

*    *

నిసిరేలలో, ఉషానిశితరాగాలలో,
తృషిత మీ యాత్మలో వసియింతు వీనాడు !

ప్రసవపేశలము నీ స్పర్శమాధుర్యమ్ము,
విసమే అమృతరసమ్ము రసికరాజ్ఞి కరాల !

స్వరజీవనీ ! వికస్వర దివ్యరాగిణీ !
తరలిరావే తెరలచెర వీడి ఓ రాణీ ! !

# ప్రశ్న

తూగాడు తరంగాల
నూగాడు రాగమాల
ఏ గాలిమర్మరాల రేగెనో ?
ఏ దూరతీరాల మ్రోగెనో ?



పొంగారు సంజమొయిలు
రంగారు కావిహొయలు
ఏ దేవశిల్పి కుంచె చిల్కెనో ?
ఏ దేవి గండరక్తు లొల్కెనో ?



మోజైన ఆకుతెరల
రాజిల్లు పూవుబాల
ఏ తేటిపాట గరగి విచ్చెనో ?
ఏ తేనెతేట వలపు లిచ్చెనో ?



నా నిదుర జీవితాన
ఈ మధుర భావగాన
మే లోకవాసి యూర్పు నించెనో ?
ఏ వేకువందు పిల్పు పంచెనో ?

# ఈ నాటికి . . .

ఏనాటి దీ రత్నపేటి
కావాసిత దివ్యవీణ ! —
ఈనాటికి తెరచి మీటి
తీవు బాల ! నా బ్రదుకున.

ఏనాటి దీ నిబిడపత్ర
జాలికాంతర ప్రసవము ! —
ఈనాటికి నీ గళార్ద్ర
మాలిక రాగిల్లు భృశము.

ఏనాటి దీ విస్తృతాభ్ర
నిభృతమ్ము నక్షత్రము ! —
ఈనాటికి నీ విశుభ్ర
నిశ్చలేక్షణ పవిత్రము.

ఏనాటి దీ రాగసిక్త
భావముగ్ధ జీవనమ్ము ! —
ఈనాటికి బాల ! ముక్త
రావ మొనగితీవు సుమ్ము !

# సంధ్యా

కిలకిలకిల కలకూజిత
నవ్యోదయ విహంగమా !
కలకలకల చలితవర్ణ
దివ్యాంబర పతంగమా !

నిలిచితి నీ సాంధ్యవేళ
నిర్మల మామక జీవన
పరిసరముల విస్తృతములు
పక్షోజ్వల దీప్తు లురల !



వెల్లువలౌ కాంతిజాలు
పెల్లున హృదయాందోళన
మెల్ల క్షాళనమై సం
పుల్లశాంతి ముంచెత్తెడు !

నవ రసాలకిసలయ సం
భవ రసార్ద్ర మృదురావము.

భవ దుచ్ఛల పక్షాంచల
రవణము నా హృది హరించె !



పూర్వదిక్సరోజ నాళ
చర్వణమధుగళమా ! పృథు
లోర్వీతల సంధ్యాసుఖ
సర్వస్వమ ! విహంగమా !

నా జీవప్రాంగణమ్మె
నవ్యోదయ నాట్యశాల !
నా హృదయ విహాయసమ్మె
నవ సంధ్యారాగడోల !



అరుగకుమా ! అరుగకుమా !
ఖరకర ప్రచండ తప్త
శరముల వసివాళ్వారుదు,
చిరమై నిలువుము సంధ్యా !

కురియింపుము కరుణా ని
ర్ఝరపాతము నీ గానము !
వరియింపుము నవశాద్వల
ధరణీ వలయావరణము !

# విద్యున్నారి

మారుతచాలిత నీరదరథ సం
చారీ ! విద్యున్నారీ !
హారి త్రిభంగీ ధీరవిషాదా
కారీ ! వ్యోమవిహారీ !

అగ్నిప్రోజ్వలి తాంశుకాంచలము
భుగ్న నభఃపథి భగ్గున విసరుచు
దిగ్దిగంతముల దేనికొరకు నీ
స్నిగ్ధ సర్పజవయానం ?

రోదోంతరము నినాదిల్లెడి నీ
బాధాఘూర్ణిత పాథోముఖరిత
ఘన ఘనాఘనోద్ఘట్టన భీషణ
రథనేమీనిధ్వానం !

ఉరుతిమిర నిశామరుసంచారిణీ !
ఖరవజ్రకశా స్ఫురితప్రహారిణీ !

చిరతరాత్రిసంభరిత విరహిణీ !
ఏల నిశీధప్రయాణం ?

క్షుభిత తారకావిభవ పాలినీ !
రభసకలిత వర్షాభ్రచాలినీ !
విఫలమాలినీ ! విధురమానినీ !
మాను భయానకగానం !

మారుతచాలిత నీరదరథ సం
చారీ ! విద్యున్నారీ !
హారి త్రిభంగీ ధీరవిషాదా
కారీ ! వ్యోమవిహారీ !

# నవవర్షా

చిటపట చినుకుల రవళుల
చటులానిల జృంభణముల
తటినీరయ జటిలగతుల
నటియింపుము, నదియింపుము

కుటిలాలక! వర్షా! నీ
స్ఫటికాంచిత జలవీణా
రటిత బిందునిక్వణముల
నటియింపుము, నదియింపుము
కుటిలాలక! నవవర్షా!



పోకల చిగురాకులె నీ
రాక సోకి రాగిల్లెడి,
మూక నారికేళ చూడ
మాకంపితమై మొరసెడి,

ఆకులహృది నాకాశమె
నీ కై మొగిళుల పానుపు

సేకరించి, ఆహ్వానో
త్సేక తటిద్ద్యుతు లీనెడి,

కలకల సంకుల నిస్రుత
జలచేలాంచల ! వర్షా !
వాతచ్యుత పూత పారి
జాతపుష్ప ధౌతశీర్ష !

నవవర్షా ! నవవర్షా !
నటియింపుము, నదియింపుము
స్ఫటికాంచిత జలవీణా
రటిత బిందునిక్వణముల
కుటిలాలక ! నవవర్షా !



అవనీతల నవజీవో
త్సవ హేలాలాస్యవతీ !
దివిజామృత లవసేచిత
భువన పరిభ్రమణమతీ !

ఫేనధవళ పాదాంచల
గాన లయద్రుత కింకిణీ !
ప్రాణికోటి హృదయతృషా
గ్లానిహారి ! మధువర్షిణీ !

శ్వేత బలాకా శ్రేణులు
శీతలాభ్ర తోరణములు !
స్ఫీత శబలబర్హ ఫుల్ల
చేతసములు మయూరములు !

అటవీ తటినీ జనపద
పటుతృష్ణా పరిహారములు
స్ఫటికాంచిత జలవీణా
రటిత బిందునిక్వణములు
నటియింపుము, నదియింపుము
కుటిలాలక ! నవవర్షా ! ——

నవవర్షా ! నవవర్షా !
అవనీమానసహర్షా ! !

# కరుణాకాకలి

కరుణకాకలి నింగి కంపిల్లు కంపిల్లు!
మరణవాంఛలు జీవమర్మాంతికము పొర్లు!!

అరుణారుణోదయ మ్మమరలోకము నుంచి
తరియించి తరియించి ధరణీతలిని ముంచె! —
కరుణగీత మ్మాకలిబాధ మరపించె!

శోకాలవాలమౌ లోకాలయమ్ములో
ప్రాకట జ్యోతిష్పతాకమ్ము లల్లాడె,
ఏకమ్మొనర్చె ఈలోకమ్ము నాకమ్ము!

ఆకలీ! ఆకలీ!
కాకలీస్వర్గీతి
నీ కర్ణసంప్రీతి
సేకరించినదిగా! —

రాకు రాకీపొంత,
మాకు లేదిక వంత!
నీ భైరవినె నేడు
నిశితకాకలి వేడు!

—౨౫

కాకలీ ! కాకలీ !
నీ కలశ్రుతి రహా
శ్శోకమ్ములనె మార్చె
నేకసౌఖ్యమ్ముగా !

పోకు పోకుమొకింత !
సోకిసోకని వింత !
కాకలీ కలకలా
లోక రాగేశ్వరీ !



ఇహలోక జీవితస్పృహ నిద్రవుచ్చె నీ
మహాదనంతానంద లహరీ మర్మరమ్ము !

అహాహ ! రాగాలాప సహసాపులకితమ్ము,
రహిత తృష్ణాక్షుణ్ణోరాశ మిలాతలమ్ము !

భగవతీ ! భగవతీ !
సుఖ కాకలీశ్రుతీ !
ముగియకే మొరయు నీ
రగులు నిస్వనమ్ము !

వగలేని సురలోకవర్తివే నీపైన
ఎగసిరానిమ్ము నన్నిక మృత్యుపక్షాన !
సొగసిపోనిమ్ము నీ సుఖరాగవక్షాన !



కరుణకాకలి నింగి కంపిల్లు ! కంపిల్లు !
మరణవాంఛలు జీవమర్మాంతికము పొర్లు !!

# శమనశ్రుతి

ఎవ రెరుగంగనేర్తు రెదనేర్చెడి దుర్భర వేదనానుభూ
తి, విమలశాంతి నా బ్రతుకుదెన్ను ననాదరబుద్ధి నెన్నియో
దివసములయ్యె వీడి, కృపదేర్చెడి నయ్యమృతాత్మ దూరమౌ
పవళులు రాత్రులున్ నరకపావకదగ్ధములై విదల్చెడిన్ !

కల లెన్నెన్నియొ తేలిపోయె నెటకో కాలాంబుధారాగతిన్,
విలసద్భావన లిందునందు జడమై విచ్ఛిన్నగీతమ్ములం
దె లయించెన్, మహదాశయమ్ములు ధగద్దీప్తిన్ మనోనేత్రముం
గలచెన్, ప్రాయపుజీవ మంధతమసాక్రాంతమ్మ యీనాటికిన్.

లవలీకోమల మస్మదంతర సముల్లాసైకజీవ మ్మిలా
భవమై కర్కశ లౌక్యసంస్థితుల నిర్బంధమ్ములం జిక్కి సా
రవిహీన ప్రతిమోపమానమయి సాంద్రస్థావరత్వమ్ము నొం
దె, విరాజత్సుభ యౌవనాశయ సముద్దీప్తమ్ము కాదో యికన్ !

కాలపయోదముల్ గగనకర్పర మాక్రమణమ్మొనర్చిన
ట్లేల విషాదముల్ హృదయమిల్లయి కాపురముండె నిన్నినా
ళ్ళీ లలితార్ద్రజీవనద మింకునొకో మరుభూమి, కాక శో
కాలె ద్రవించి శాంతిసుధ కాల్వలుకట్టునొకో యొకింతలో !

# ఎవ్వరు?

ఎవ్వరీ గూటిపట్లు కంపిల్ల నిస్పృ
హార్త నిశ్వసనానిలాహతుల రేపి
నా ప్రవాస నితాంత సాంగత్యహీన
జీవితైకాంత్యమును చీల్చి యావరించి
శూన్యనీడమ్ము భేదింప జూచువారు?



ఎవ్వరీ యొంటికొంపకై దివ్వెబట్టి
వెదకి వేసారి ఆతిథ్యపదము గోరి
నా తమఃకవాట విపాటనమ్మొనర్ప
కరుణవీక్షా తటిత్కాలికల రగిల్చి
ఈ కుటీరమ్ము నుసిజేయ నెంచువారు?

# ఆకాశం

పందిరిమంచం పరువల్లాగా
ఉంది పింజమబ్బుల ఆకాశం
అందులోన వెన్నెలతెరలో బ
బ్బింది నిండుజాబిల్లి.

మెల్లమెల్లనీ పిల్లగాలులా
చల్లని వెన్నెల నూచునుగానీ
అల్ల నింగిలో పరిచిన మబ్బుల
తెల్లపరుపు నిశ్చలము.

అక్కడక్కడా చుక్కవొక్కటీ
పక్కకుచ్చులా మిలమిలలాడును,
చుక్కను చూసీ చంద్రబింబమూ
ఫక్కున కిలకిల నవ్వేను !

ఏదిశనుంచీ మళ్లెనో గాలి——
ఎల్ల దిక్కులా కళ్ల ముందరే
నల్లమొగిళులూ నక్కుతు నక్కుతు
మెల్లమెల్లగా కమ్మాయీ,
తెల్లపింజలా దూదిమబ్బులా
వెళ్లగొట్టివేశాయి.

కారుమబ్బులో తారలు అడగెను,
కారుమబ్బులో వెన్నెల ఉడిగెను,
కారుమబ్బులో కలలూ మడగెను,
కారుమబ్బులో కలతనిద్రలో
కేరున నేడ్చెను జాబిల్లి !

తూలిపోయె ఆ మబ్బులపానుపు !
తేలిపోయె ఆ వెన్నెలతెరలూ !
పాలిపోయె ఆ యాకసదీపం !
ఏల పోయె నా స్వప్నమ్ము ?

# నవాలోకము

లోకమ్ములో నవా
లోక మ్ముదయమయ్యె !
శోక మ్ముడిగి పాడు
మో కవీ ! ఓ కవీ !

రాకాసుధాకరా
లోకోదయమ్మయ్యె !
చీకుచింతల మాను
మో కవీ ! ఓ కవీ !



కరిమొగిలు చాయ లే
దరిని తేలని రేయి,
ఘరమైన బ్రదుకైన
కరిగిపారెడు రేయి,

తెరచుకో నీ తలుపు,
అరసి రానీ పిలుపు,
విరియనీ నీ వలపు,
ఓ కవీ ! ఓ కవీ !



చుక్కలన్నీ గోట
నొక్కమారే మీట
దిక్కుదిక్కుల వీణె
చొక్కి మ్రోసిన రేయి,

వెక్కియేడ్తు వదేల ?
ధిక్కరింపుము శోక
కర్కశావేదనల
నో కవీ! ఓ కవీ!



'పాలత్రోవ' తరంగ
దోల రిక్కల మీలు
తేలియాడుచు నింగి
మేలమాడెడి రేయి,

కేళికాభావనా
జాలమ్ము బర్వి నీ
వేల యానందింప
వో కవీ! ఓ కవీ!



నిండుపున్నమ రేయి
పండువెన్నెల పూచె! —

కొండకోనల శాంతి
మెండయ్యె, మెండయ్యె!

ఉండనీ నిట్టూర్పు —
ఎండువారిన బ్రదుకు
నిండిపోనీ వెలుగు,
ఓ కవీ! ఓ కవీ!



విశ్వ గానాలాప
నిస్వన మ్మాలింపు!
విశ్వ దీపాలోక
రశ్మి సందర్శింపు!

నిశ్వాస నిర్ఘోష
విశ్వసింపకు నేడు —
శశ్వదానందమూర్తీ!
కవీ! ఓ కవీ!



5

# వసంత యాత్ర

ఓ యాత్రికుడా ! ఓహో యాత్రికుడా !

ఉదయారుణ కాంతిపుంజ
సదనము దెస పయనింతు వాహో
యాత్రికుడా !



హృదయపూర్ణ మృదులగాన
సుధల జల్లి మధుపథాన
కదలిపోవుచున్నా వోహో
యాత్రికుడా !

అంధకార దీర్ఘనిశా
బంధనమ్ము సడలించుక,
గంధవాహ తురంగమ
స్యందనమ్ము గదలించుక,

సింధుపార పూర్వదిశా
సుందరతీరమ్ము జేరు
నో యాత్రికుడా !



శీతల హేమంతకాల
శిథిల జీర్ణ పర్ణశాల
వదలి కదలివచ్చితి వోహో
యాత్రికుడా !

చైత్రమాస కుసుమ లతా
పత్ర తోరణమ్ము లూగ,
చిత్రచిత్ర కలవిహంగ
గాత్ర నిస్వనమ్ము రేగ,
మిత్రవరా ! నేడు నీ ప
విత్రయాత్ర సాగింతు వోహో
యాత్రికుడా !



సుప్తజీవితమ్ము రోసి
గుప్తాశయ భరము మోసి
ప్రాప్తయౌవనుండ వైతి
వో యాత్రికుడా !

రక్తనాళ ముక్తధార
శక్తులూరి పొంగిపారి,
రక్తరాగ రంజితమ్ము
దిక్తటమ్ము నంటి మీరి,

ప్రాక్తనప్రపంచ భావి
ముక్తివేల కొల్లగొందు
వో యాత్రికుడా!
ఓహో యాత్రికుడా!

# కీలాంజలి

స్మృతిలోకం
తలుపు తెరవకే,
చితిమంటలు
పైకి పర్వునే!

గతకాలం పై
తెరను తీయకే,
క్షితి నుత్పాతము
లుప్పతిల్లునే!

*

జలవాహినిలో
బుద్బుదాలమై
కలలేకని సం
తోష మొందలేమా?

తెలిమంచుల
బాష్పమౌక్తికాలే

మన గళమాల న
లంకరించుకోమా !

*

యువజీవిత
సాహచర్యముల్
అవమానాస్పద
మన్నదెవ్వరోహో !

పవమాన సు
గంధిలోత్సవ
మ్మెవ డాపగ
లాడు ధాత్రిలో !

*

మానస ప
ద్మంపు పుష్పొడుల్
తేనియలూ వృధ
సేయబోకవే !

ప్రాణసఖుం
డున్నవా డొకం
డీనాటికి నా
సించి నీ సుఖాలే !

*

శోకాలనే నా
సువర్ణ తూలికా
లోకంలో పరి
మార్చనీయవే!

నీకై నిర్మల
మైన కాన్కగా
ఈ కావ్యాంజలి
స్వీకరించుకోవే!

# దేవి !

కలకలమేదో గుండెల
జలదరింపజేయు రేయి !

విలవిల చలియించెడి యే
విహ్వలతయొ విరబారిన
పక్షవిస్తృతత నాపై
బర్వి, పులకరించు బ్రదుకు !

నిర్వృతియో, నిస్పృహయో,
నీరవ హృదయరహస్యమొ,
కాలమేఘ గాంభీర్యమొ,
నీలగగన వైశాల్యమొ,
ఆలస్యము సైరింపని
బేలజీవి తృషితాత్మయొ,
మేలుకొల్పి మెయి సోకిన
చేలాంచల సంచలనమొ,

దూరపు పిలుపో, మంగళ
హారతుల గుబాళింపో !

దేవీ ! ఏ మధురాకుల
భావనముల బరపుదువో ?
దేవీ ! ఏ స్మృతిపథ సం
చారణముల నెరపుదువో ?

లోకాలోకమ్ముల నెగ
బ్రాకిన దే పరీమళమొ !
ఆకుసందడుల గుసగుస
లాడిన దే సుధాగళమొ !

రేకురేకులను పులకలు
సోకిన హృదయాంభోజము
చీకటుల గుహాంతరమం
దే కాంచెనొ ఇనోదయము !

హే గుప్తాశయకీలా !
హే దీప్తాశాజ్వాలా !

రాతిరి తెలవారె మనకు
రారమ్మని పిలిచినవో
నీ తలపులు కాతరమై
చేతులు సారించినవో !

దూరమనెడి తంతువు నీ
కేల నొడిచి నా గుండెల
చేరువగా చేదుకొంటి
పేరాతిరి నో దేవి !

కర్పూరనివాళి నిచ్చి ,
కరవీరసుమాల గ్రుచ్చి ,
తెరమరుగయి నిలిచి పిలుచు
చిరరజనీ హృదయరాజ్ఞి !

కలకలమేదో గుండెల
జలదరింపజేయు రేయి !
విలవిల చలియించెడి నే
విహ్వలతమొ యెద యిల్లయి !

# ఆకాశ తార

దూరాన నాకాశ
పార మంటిన తార
జేర దొరకొన్నాను
పేరాసన్ !

అరతందిచ్చునో,
వారించునో నన్ను,
చేరుకోనేలేనా
ఈరేయిన్ ?

*

జలరాశి కద్దరినె
మిలమిలా మెరిసేటి
జలజమ్ము సౌరభమె
వలచాను !

దరవికాసించునో,
విరియనే విరియదో,
విరసించి విరిరాణి
తరలేనో ?

ప్రవహించు నిర్ఝరిణి
నవరోధ మొనరించి
దవదాహ మార్పుమని
దరిశాను !

పొరలి ముంచెత్తునో,
కరము లందిచ్చునో,
పరిహాసమున వీడి
పరచేనో ?

*

తేలిపోయే చల్ల
గాలినే నా మురళి
నేలుకోమని సమ
ర్పించాను !

కాకలీనిస్వనమె
కల్పించునో, వంశి
కయి నంటకే విస
ర్జించేనో ?

# ఐంద్రజాలిక

ఎవతెవు నీవు దూరమున నే భ్రుకుటీనటనమ్ము సేతనో
నవజలదమ్ము లందునె వినగ్నగళమ్మున మ్రోగు నిష్ఠురా
రవముల రేపినావు!, విను రాల్చిన రిక్కలవెల్ల మంటలై
లవములవమ్ములై తునుకలై చితిపేర్చెడి నా జగమ్ముపై!

కనబడకే కనుంగవకు గాటపుగోరిక లేల పూన్చి నీ
ధనువున రంగురంగు జలదమ్ముల లేతెర జీల్చెదేల, నా
మనసును వ్రేల్చెదేల, పరిమాణము లేని కఠోరభావ మూ
నిన మనజాలునే జగతి నీ సుమహస్తమె నిప్పుగుప్పినన్!

దురుసుకటారి నీ యొరను దూసి నిశాజఠరమ్ము గోసి, భీ
కర రుధిరమ్ము బిందువు నొకండయినన్ భువి జేరనీక నే
యరుదగు నింద్రజాలము వియత్తున జేసితొ?, శోణితంపు తుం
పరలయి వ్రేలె తారలు నభస్థలి కీలల తోరణమ్ములై!

సుందరవిశ్వమోహిని! రసోల్బణమూర్తి! మదంతరాత్మ నీ
వెందుల కగ్నికుండమిడి యింధనముల్ రగిలించి, సాంద్రధూ
మాంధములోనె ప్రజ్వరిలు హాలహలాద్భుత కీలికాగ్రసీ
మం దలిరాకు పాదయుగమంట నటించెద వైంద్రజాలికా!

# ఉగాది కొన్క

నవ వసంతాన విరియు నీ పువుపెడంద
పొరలిపారు మరందంపు దరగలందు
దేలి మెలమెల్ల నాడు రత్నాలనౌక
నాకొర కొకింత తావుంతువో కుమారి ?

ఈ యుగాదిఘట్టమ్మున వేయువేల
వర్షములు నిండు కాలస్రవంతి యేని
ఒక్క నిముసమ్ము వడినాపి, యూరడించి,
ఈసడింపక నాకు సావాసమిచ్చు .

లలిత కిసలయ ఖాదనోల్లాసి పికమె
కంఠమెత్తి నా మురళికా కలరవాన
లీనమొనరించి యాహ్వాన మీను నేడు
నీ చిరుతనావ నిద్దరి నిలువరింప .

హృదయ కేదారసీమ లందిచ్చు హేమ
సస్యసంపదలను రాశిసలిపి, దరిని
వేచియుండె నీ యామనివేళ నొక్క
దారిబత్తెము లేని యాత్రాలసుండు !

తేలికై తేనెకెరటాల దేలు బాల్య
చపలహృన్నౌక పరిపక్వ శాంతజీవ
సస్య భారమ్ము సైరింపజాల దనుదో ? —
విరు లురల్చు వృంతమె ఫలభరము నోర్చు !

కాలమునకు పుట్టినరోజు వేళనాడు
ఏ నొసగు కాన్కయే భరమ్మని, గొనుము
మలయ గంధానిలము కన్న జలువ లొలయు
సుమసుకోమ లాశీర్వాదసూక్తి నేని !

# మోహితవని

" ఆ వనవీధి వాయువు లహర్నిశ మూరకె నిశ్వసించు, నా
తీవలత్రోవలం దళులు దీనత గ్రొవ్విరులన్ విరాళి సం
భావనచేసి ప్రాకు, నట పక్షిసమాజము ప్రేమవేదనా
రావములం దయారసము రాల దపించు సదా హతాశమై.

అటవిని గాయు వెన్నెలలె యచ్చట బొల్చిన చంద్రికల్, సుధల్
బొటబొట మంచుబిందువుల ప్రోవులుగా నురలంగ వ్యర్థమై
చిటులు శిలాతలాల, చిరుచీకటి నవ్వనవాటి గామినుల్
కుటిల విమోహజాలికల గూర్తురు లేయెద లాహరింపగన్.

లలితములైన ప్రేమలు విలాసముగా నటువోయి యెన్నడున్
వెలివడలే దనంతపరివేదన నీల్గక, ఆ వనీపద
మ్ముల నకళంకభావుకులు ముగ్ధపదమ్ముల ద్రొక్కిరేని బా
ష్పలహరి లోతులాని నిరపాయత బారము జేరలేరికన్.

ఊహల మోసులెత్తు వల పూరక సైగలజేసి పిల్చు స
మ్మోహిత కాననాంతర విమోహన పత్రవిలాసలాస్యమం
దా హితభాష లొడ్డిన విషామృతజాలము లానసేయ కో
స్నేహమయార్ద్రమానస ! కృశింతు వనంత విషాదబాధలన్ !

రంగులురంగులై విరియు రమ్యసుమమ్ములు మోహపన్నగా
లింగితలన్ వనీలతల ; లేయలలన్ విషపూర్ణమౌ సుధా
భ్యంగము లీను నవ్వనవిభాసిత పుష్కరిణీజలాల ది
వ్యాంగ వినగ్నశోభల వెలార్చుదు రాటవికైంద్రజాలికల్.

అమృతము లీని దృక్కుల. సుమావృతకేశ వినీలరోచులం
దమిబిగి నారబోసి, యవతంససుమమ్ముల క్లిశ్యమాన భృం
గము లొగి మూర్ఛనల్ గునియగా, నుపగూహన గూఢ మంజుశై
త్యముల నొయారపున్ విషమయామృత మొల్కుదు రైంద్రజాలికల్.

ఎవడవు కోమలాంగుడ వదేల విశాలలలాటసీమ లే
తవెతలు రక్తనాళముల తప్తముకాగ దలంతువేమి, నీ
నవకముదేరు చెక్కిలి వినమ్రత వాడుతురాయిరేకుగాన్,
నవతృషితాత్మ మోహితవనాంతరసీమల తారినాడవో ?

కమలెను నీ ముఖాంబుజము, కన్నులు కోర్కెలు రాజి రాగసాం
ద్రము, లధరమ్ము దా నదరు, తంద్రము క్లాంత నవాంగశోభ, లే
భ్రమణములన్ భవన్మృదుల భావవిలోలపదమ్ము లైంద్రజా
ల మధుర కాననాంతరవిలాసము లానవడెన్ హతాశయా ?

నిలువగలేదు నీ హృదయనిర్భృతమౌ ప్రణయార్తరాగ మా
కలి దపియించు నీ కృశ వికంపితగాత్రము. ప్రేమపాత్రికన్
వలపులతేనియల్ గొసరి వంచన మోహిను లానవెట్టిరా,
వలగొనిరా మృషామధురవాంఛలు రేపి వనీవిలాసినుల్ ?

కలతెరగెల్ల దెల్పుము, సుకమ్ముల నెవ్విధి గోలుపోతి వో
విలసితగాత్ర ! నీ ఎడదవీణియ ద్రుంచిన క్రూరకర్మ లే
తళుకుల పూవుటీరముల తారెడి శోభనగాత్ర, లెట్టి చా
యల వసియించు చంచలదృంగంచల, లే చపలప్రియైషిణుల్ ? ”

  

“ తెలి మంచుముత్యాల కలకలలాడు తో
రణపంక్తు లాశాంతరముల తూగె,
పగలురాకను తెల్పు తొగరుకాంతులు తూర్పు
మొగసాల సొగసులనగవు లొల్కె,
నవయౌవ నానందరవము దక్షిణదిశా
పవమానముల దేలి భ్రమల జిమ్మె,
చిగురుజెండా మింట నెగురవేయుచు వసం
తంబు తామరమొగ్గ కంబు వూదె,
అది యువ నవారుణోదయ మ్మట్టివేళ
నా నవోన్నిద్ర జీవితానూనతృష్ణ
జటిలమై క్రమ్మ నే యైంద్రజాల మోహ
దారుణాంధ వాగురల బందాలువడెనొ ?

వెదురుజొంపమ్ముల వేణునాదమ్ములు
హృదయదాహమ్మును పదనువరచె,
పన్నగంబుల బోలి ప్రాకులాడుచు లతల్
విన్నాణమౌ పూవుసన్న లొగ్గె,

ఆకుటీరమ్ముల నళిసమూహమ్ములు
మోహంపు తెరలను మోహరించె,
నింగినేలయు నిండి పొంగు సౌరభవాయు
వింగితమ్ముల గొసరించె వలపు

లా వనోపాంతసౌందర్య భావనమున
తనుమనమ్ములు మోహాన దవిలి భ్రాంత
పాదయుగళుడ వేదనాపాంథుడ నయి
మధువుల పథాల కంటకవ్యథల గంటి!

కరుణార్ద్రహృదయ! సహృదయ!
వెరగొ నా ప్రేమగాథ వివరింతు నెటుల్,
పరిమోహితమౌ నవ్వన
చరితము వర్ణింప నాకు శక్యంబగునే?

అడుగు మోపిన నెండుటాకైన గుసగుస
లాడి ప్రేమలె తొలకార్చి రేచె,
బడలిన యంగుళీపల్లవమ్ముల నాన
ఫలశాఖలే మేన పులక లీనె,
తనువు భూస్థలి వాల్ప నునుచాయలే గిలి
గింతల కోర్కె రెట్టింత జేసె,
దాహమ్ము గొనబోవ దరినున్న సరసీ జ
లమ్ములే దరచుంబనమ్ము లొసగె,

ఆ మనోజ్ఞ వనీజాలమందు సర్వ
మొక్క పన్నుగడకు చేతలొడ్డి, తీపు
లడుగడుగునందు బొదివి వెన్నంటియంటి
యువ గవేషణపరుల నం దురులబట్టు.

ఇటు లాశల్ విచలించ మైమరచి మోహీభూతమౌ కాననో
త్కట సౌందర్యపుటెల్లలం గడచి తత్కాంతారమధ్యమ్మునం
జటులాశల్ దహియింప గాసిలి, తనుశ్రాంతిం గనుల్మోడ్చి ని
ష్కుటిలమ్మౌ హృదయమ్ము భావభరమై సుప్త్యంబుధిన్ మున్గితిన్

నిదురన్ మోడ్చిన కన్నురెప్పగవ నే నీరేజపత్రాక్షి త
న్మృదు శోణాధర చుంబనాంకమిడెనో మిథ్యాసదంతర్విభి
న్నతలే యంటని స్వప్నవీధి విరిసెన్, తారుణ్య భావాభ్రమం
దుదయంబందిరి విద్యుదంగనలొ, యిందూద్భూతరోచిష్ణులో!

పదియునారేడుల బాలాకుమారి తొ
ల్దొలి నా యువస్వప్నముల రగిల్చె,
బంగారువన్నె తన్వంగి లావణ్యమ్ము
లవలీ కుటిలమంజులతల నేర్చె,
చేరలంతల కండ్ల తారళ్యదీధితు
లాశావియచ్చంచలాప్తి గూర్చె,
ముగ్ధాననంపు సుస్నిగ్ధ మార్దవలక్ష్మి
పలుకాడకే ప్రేమ జిలుకరించె,

మూగవలపుల యరవిరిమొగ్గ మొలిచి,
విడివిడని తావులే స్వప్నవీధి బొలిచి,
కరగి విడిపోయె నవబాష్పకణము భాతి——
మిగిలిచె నొకింత నా తొలివగల చింత !

కలగిన స్వప్ననేత్రముల గ్రమ్ము నవాశ్రుకణమ్ములందె ని
ష్ఫల ప్రణయార్తిగీతముల బాడితి నా తొలికోర్కి సాంత్వనా
విలరుతి, లేజివుళ్ల పొదివిళ్ల తలంపుల దాచికొంటి చం
చల మృదులస్మృతుల్ విగతసౌరభసూన సువర్ణపర్ణముల్.

మరియొక్క విరిబోడి మంజులప్రణయ శో
భనమూర్తి నా స్వప్నమున వెలింగె,
కనుదోయి ప్రౌఢభావనలేవొ తరళ ధా
వళ్యరోచిర్వైభవమ్ము బొదివె,
విశదఫాలాన నే యశము వాసించెనో
యమల చంద్రజ్యోత్స్న లాటలాడె,
శారదాదేవి వాగ్జాలమ్మె పన్నెనో
మధురాధరము తేనెమాట లొల్కె,

మెరపుదీవల ముగ్గులమెరుగు లుంచి,
స్వప్నసీమాంతరమ్ముల సంచలించి,
ఎడదలోతుల దనపాద మిడి నటించి,
కనకమంజీర రవముతో గదలిపోయె !

ప్రతినినదించి నా హృదయపారములెల్ల తదీయ నూపురా
మృతనటనమ్ము లేల విరమింప ? మరీచికలేన యీ నవో
ద్ధత నిరతప్రతీక్షలు ? మదీప్సితగమ్య మనంతవేదనాం
కితమయి దూరదూరమయి కేవలవిభ్రమమై నశించునా ?

అని తలపోసి నిరాశా
జనితార్తి గృశించి, మోహజాలమ్ముల న
వ్వనమున కలతెరువుల యీ
వనసుప్తి నదెంత వనరి వాపోయితినో !

ఇందుబింబమ్మునం దింతి చల్లని ముఖ
ప్రతిబింబ ముదయించి భ్రాంతి ముంచి,
నక్షత్రసందీప్తి నా కామితప్రియా
చక్షుర్విభాసమ్మై చంచలించి,
నీల కాదంబినీపాళి మత్ప్రణయినీ
కైశికధ్వాంతమ్మై కవిసి కవిసి,
ఉదయసూర్యద్యుతుల్ ప్రిదులు పూర్వాద్రి నా
లావణ్యవతిగండరాగ మొలికి,

ఆ దురాశాప్రలోభితాశాంతరాళ
మెల్ల కెలకుల సమ్మోహవల్లరీ ప్ర
సూనములు రాల్చు రేకులే సుడులుదిరిగి,
నిదురరెప్పల మిరుమిట్లు గదిరె నాడు !

అనిశోద్రిక్త మనోవ్యథాకులత నత్యాయాసలబ్ధోపలా
లన నూరార్పగడంగితిన్, నిదుర గళ్లంగట్టు నయ్యైంద్రజా
ల నిరాధార వికారలోలనల నొల్లంబోక సమ్మోహనా
జనితావేశవిరక్తి దూరితి ననైజస్వప్నసౌందర్యమున్.

కలలంగన్నది యెల్ల హేతుమతి నే కామ్యమ్ముగా నెంచ నె
ట్టులు సంభావ్యమటంచు దర్కముల చుట్టుంద్రోవలం దాగి, మా
యలచాయల్ గన భీతివోతి నపు డాయాలోచనాక్లేశమే
ఫలితమ్మై కలదారి విచ్చి క్షుభితప్రాణమ్ము నిద్రన్ విడెన్.

తలపోసిన తలపులు వాం
ఛలు వగ లానందములు సుచారుస్వప్నా
శలు గడచి, కడ నిరాశలె
మెలకువను వెలారె చాయమెయి నా యెడదన్.”

  

“ తర్కింపు ద్రోవల దరియంటనగునో ?
కోర్కెల వాదాల గుంచింపదగునో ?
నిదురమాయల కలల్ చెదరిపోవగనె
వదలునా యా తావి పొదువక బ్రదుకు ?

ఆ వన్నెచిన్నెల యన్నులమిన్న
లా వనీసౌందర్య మా యింద్రజాల

మో మోహితకుమార ! ఏమాయెనోయి ?
ఆ ముందుకథ విన నవధరింపుదము ! ”

  

“ చల్లని మాయవెన్నెలల చక్కిలిగింతలు స్వప్నమోహవి
ద్యుల్లతికాళి సైగలును తూరుపువేకువదారి దూరమై
కల్లగ దోచెగాని, యెద కన్నులువిచ్చిన తెల్వివేళ నే
పిల్లనగ్రోవినో మెదపి పిల్చుచునే కదలాడె గుండెలన్ !

లలితమౌ నా వింతరవళి యే దిశను
పిల్చెనో హేతువు పోల్చనేలేదు ;
కలసోయగము లవి కరగిపోయినను
మెలకువ నే లోతు తలపులోయలనౌ

అగణిత పుష్పదళాకృతుల్ బూని
విగత ప్రణయమూర్తుల కళాంశకములు
ప్రాణమ్ముగొని నిల్చి రాణింపదొడగె
ప్రాయంపు జీవనప్రాభాతవేళ !

ఒకరిద్దరు ప్రణయినులే
వికసించిరి స్వప్నవీధి ; విచ్చిన తపనో
గ్రకరంబుల భాతి ప్రియా
నికరంబులు వెలసె నా యనిద్రావస్థన్.

ఏ యొయ్యారము, లెట్టిచాతురులు, నేయే మౌగ్ధ్యసంపన్నతల్
ఏ యార్ద్రామల వాక్కలస్వనము, లేయే స్నిగ్ధహాసార్థముల్
నా యున్నిద్ర మనోరథాశయ విలీనంబై ప్రవృద్ధంబులో
ఆయా భవ్యగుణంబులే పొలిచె నా యస్పష్టసంబోధనన్.

నిదురలో గన్నులంగట్టి నిలిచియాడి,
బ్రదుకులో జూపుమొరగి విభ్రమము గొల్పి,
లోలకాంతుల చాయలేవో లయించి
మేలుకొన్న మానసవీధి మిన్కులాడె !

చిలుక ఫలంబులం గొరికి చిక్కక రాల్చిన రీతి నాసలన్
వలచుకు చేయి సాచికొని వంచనపాలయి దూరినాడ, నీ
తలపుల దాగు వాంఛలకు దక్కిన నా యెద నింక మేలుకో
ల్కలలె దహించునో విడిన కన్నుల నేటి శుభోదయంబులన్ !

మదనవసంతు లిర్వురు సుమాస్త్రము లగ్ని రగిల్చి నా యెదం
బొదివిరొ, యీ రహోవ్యథ బ్రబోధితమైన గవేషణంబునం
బదములు భ్రామ్యమాణమయి ప్రజ్వలితాశయదీప్తి నల్గడల్
వెదకు నగమ్యలోకపదవీ కుటిలాధ్వములంటి వేసటన్.

వీడకే నీడయై వెన్నంటి యే భావ
బంధుర ప్రతిమయో ప్రాకిప్రాకి,
దినదిన కార్యబంధనములందే సువా
సితమై నిరాలంబగతి మెలంగి,

జ్ఞానార్జనాలోల మానసవీథి బిం
బీకృతమ్మయి లోన బిలిచి పిలిచి,
కవితానిరంకుశ కల్పనాచాతుర్య
ములనెల్ల దన శోభ తొలుకబోసి,

కోయిల కలస్వనమ్మయి, రేయిరేని
సితకిరణరేఖయై, కోరకితశుభ్ర
భాత సిందూరరాగమై భావలోక
మావరించె నా లేయెద నాహరించె!

అవ్యక్తమధుర మా యాకృతి సొగసు
అవ్యాజవిలసిత మా వ్యక్తి మనసు
అస్పృశ్యము నదృశ్య మా స్వరూపమ్ము
సాదృశ్యరహిత మా 'చాయపటమ్ము'!

తన రూపు స్వప్నలతలె పూచునేమొ,
కనులకు గల చాయ గాన్పించదేమొ?
సుమగాత్రము మొరంగి సురభిళత్వమ్మె
భ్రమజాలముల బర్వి బంధించునేమొ?

ఒకమారు సుఖవిపంచిక మీటి రంజించి,
ఒకమారు మురళీధ్వనికి రగిల్చి,
ఒకమారు నృత్యఘంటికల క్వణన జించి,
ఒకమారు తాళగించుకు నదించి,

ఒకమారు కలికిచిలుకవా క్కనుకరించి,
ఒకమారు శారికలకు సుతించి,

అరుణ తరుణ స్మితాస్యమ్ము నొరసికొనగ
కలితలలితశ్రుతి శ్రావ్యగళరుతాన
నొక్కమారు వినగ్నగానోర్మి రేపి
అంతులేని రోదసి ముంచునట్లు తోచు !

మేఘంపు హృదయాన మెరసిన వేళ
నాకవీధికలలో నట్టాడు మించు,
నాలోన లోజూపునకు బూచు పూవె
పైలోకమున గూడ బ్రమయు నా త్రుటినె !

కనులతో గుండెలో గనులలో వెదకి
వనపాదముల జగత్తున గవేషింతు,
'అమలకోమలమూర్తి ! అమరసందీప్తి !
అప్రాప్తమోహినీ ! ' యని పల్వరింతు.

అగపడకే సుధార్ద్రదరహాసము లొల్కిన ప్రేమమూర్తి యిం
చుక కరుణింపదో కుసుమశోభన గాత్రవిలాస దర్శనం,
బగణిత కాంతిజాలికల నాకృతి జాటొనరించు పేలొ, యీ
జగదఘపంక మా యమలచారుశుభాంగము లంట నొవ్వనో ?

కలకలలాడె నా హృదయకంజదళమ్మున రాలి యావియ
ల్లలన సుబాష్పమౌక్తిక మలంకరణమ్మయి యొందు నేడు, కో

మలతర మామె లేయెడద మత్ప్రణయవీథ గాంచి సానుభూ
తి లలితమాయెనో, కరుణదృష్టి దయార్ద్రమయై కరంగెనో!

సురసుఖసీమలన్ మసలు సుందరగాత్రి వసంతయాత్ర ని
ర్ధర జలదాలదారి నవతారిణియై, యుపశాంతిమూర్తియై,
చిరవిరహాతపార్తసరసీజము నా హృది స్వర్ణవేదిగా
స్థిరతరరాజ్ఞియై ప్రణయశీకరవర్షమె చిల్కరించునో!

అను నాశ నేటి నా యాత్మ దోతెంచు,
కనబోలునో గవేషణ కావ్యఫలము!
మోహితకాంతార మోహనస్వప్న
మోక్షంపు సుముహూర్త ముదయించెనేమొ?

ముగ్ధవిలాసినీ స్నిగ్ధరాగమ్ము
ముక్తసంభాషణామూర్తి సోయగము
అవ్యక్తమధురస్వరవ్యక్తి గరిమ
అభినవరూప మీ యార్ద్రబాష్పమ్మొ!

అర్కకరమ్ములన్ మృదుశుభారుణరాగము తేరె, పూర్వపుం
దర్కము లంతరించునొ, హతమ్మగునో మృష, లింద్రజాలముల్
గోర్కెల వంచనల్ భ్రమలు గ్రుంకునొ నేడు, మదాశయమ్ము లే
కూర్కుల విచ్చి యభ్యుదయకోమలకాంతుల కొల్లలాడునో!"

  

“ ఓహో ప్రేమకుమార ! నీవు కవివాదో లేక వేదాంతివా
దో ! హృత్తాప మడంపనెంతు వొక భావోద్భూతబాష్పాంబువం,
దూహాలోకములో జరింతువాహా ! నీ యుత్కృష్టసంవేదనా
సాహస్రాంశమయేని బాహ్యజగతిన్ సాదృశ్యముం గాంచెనా ?

ఆ వియత్కన్య నేత్రాంచలబిందు
వాకాశకుసుమమే యగునేమొ రేపు !
అర్కద్యుతుల మాయ లడగుట పోయి
స్రుక్కునేమో నీదు సుమజీవనమ్మొ ?

అన్వేషణమ్మునం దలసి వాడితివి,
ఆశీస్సులోయి నీకగు నాత్మశాంతి !
ఆ యదృష్టమ్మందె ఆశ హత్తించు,
ఆ యాశనె నిరాశ యడగి నిద్రించు ! ”